# ❁ శ్రద్ధాంజలి ❁



మా అభివృద్ధికి నిరంతరం శ్రమించిన

## మాగుంట రామచంద్రారెడ్డిగారు

22-7-90 తేది ఆదివారం మాకు దూరమై పరమాత్మకు చేరువైనారు

వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము

### ఉత్తరక్రియలు

1-8-90 తేది బుధవారం-నిలుపు

2-8-90 తేది గురువారం-ఎత్తురేవు

నెల్లూరు, పొగతోటలోని మా వసతి గృహము నందు జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము.

మాగుంట శకుంతలమ్మ - భార్య

మాగుంట కోటారెడ్డి - కుమారుడు

కుమార్తెలు

అమృతవల్లి

పర్వతరెడ్డి కామాక్షి

కొండా పద్మ

అల్లుళ్ళు

ఐ. ఎస్. దేవనాయకం

అనీల్ కుమార్ రెడ్డి,

విజయకుమార్ రెడ్డి

మనుమరాలు–పర్వతరెడ్డి శ్రావ్య.

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press - Nellore